విజయరాంపురము ప్రొప్రయిటరు

# శ్రీ చలికాని వేంకటసూర్యరావుగారి

ఆశ్రితుఁడు

# క్రొత్తపల్లి సుందరరామయ్యాచే,

రచియింపఁబడినది.

---

[illegible] నల్లర్ కర్రా వేంకటరత్నముచే,

ప్రచురింపఁబడియె.

రామమోహన ముద్రాక్షరశాల, ఏలూరు.

(మొదటికూర్పు 1000 ప్రతులు.)

1915.



దీని వెల 0—8—0 అణాలు.

శ్రీ

# వ్రణ చికిత్స.

శా. శ్రీమద్ద్రోణగిరీంద్రహస్తుఁడును, ధాత్రీపుత్రికానాళి ర
క్షామేయప్రతిభావిభాసితుఁడు రామాంఘ్ర్యర్చనామోదస
త్సేముండుగ్రనిశాటభంజనుఁడు భస్మీభూతలంకాపురీ
ధామైశ్వర్యుఁడు వాయునందనుఁడు నిత్యంబున్ననుం బ్రోవుతన్

తా. ఇది వ్రణచికిత్స యను గ్రంథమగుటచేతను ఆంజనేయునిఁ గృతినాయకునిగా నియమింపఁ బడెను. ద్రోణగిరీంద్రహస్తుఁడగుటచే వనమూలికలు మొదలయినవాని సూచనయు లక్ష్మణమూర్ఛను బోఁగొట్టుట వలన వైద్యశిఖామణి యనియుఁ దేలుచున్నది.

సీసమాలిక.

పాటసుగంధి యీశ్వరికన్యకోమలి
కఱ్ఱపాలయునుప్పి గాన్గుదొండ
దింతెనయులిమిరి తెల్లజిల్లేడు వా
కుడు బోడసరమును నడవికంద
నల్లయుమ్మెత్తయుఁ జల్లమునుగనేల
తాడివట్టుకసింత జీడితెగడ

నేలగుమ్మడిరేల నేలవేములవంగ
చిక్కుడుగురివింద చెంబపాల
కొడిసిరత్నపురుష కోకితహంసపా
దియుఁ బిల్లితేగలుఁ దిప్పచిత్ర
మూలముచ్చింతయు భూశర్కరయు జిత్తి
కారింగువయుఁ బొన్నగంటిగుంట
కలగరనాభియు నెలుకజీడియుఁ బర్ప
టమును వావింటయుఁ జెముడుగార
పల్లేరుపెన్నేరు నల్లేరునూడుగ
దూసరయును బొడ్డుబూసరయుచు
గీ. చేదరాసియుఁగాడేప చేదుబీర
నాగముసీఁడియుఁ గలబందచాగ మొదలు
సకలవనమూలికలచేత జానుమీఱు
వనవినోదంబుచెందుర్తిజనపదంబు. 2

తా. ఈవనమూలికలు గ్రంథకర్త స్వయముగా వాడినవియు, నివాసముగు చెందుర్తియడవిలో నివి యన్నియుం దొఱకునవియనియు వ్రణచికిత్సలలోఁ దరుచు వాడఁబడునవి యనియుం దెల్పియుండెను.

సీ. సర్వవిషము మంత్రశక్తిచేనీరుగాఁ
గావించిమాతాతగాంచెఁ బేరు
మంత్రజలంబుచే మానినీ ప్రసవవే
దనమాన్పిమాతండ్రి తాల్చెఁగీర్తిఁ

బహుచికిత్సలు పెక్కు పరికించి నేర్పుతో
వ్రాసినాయన్న మేల్వాసిఁ గాంచె
నేనుభిషగ్వర స్నేహంబునం జేసి
వ్రణచికిత్సయనంగఁ బరగుదీని,
గీ॥ వ్రాయఁగాఁబూనితిని క్రొత్తపల్లివంశ
జుఁడను సుందరరామాహ్వయుఁడనుదీనఁ
గలుగు గుణములు గ్రహియించి వెలయఁజేయఁ
డార్యులార! సుధీవైద్యవర్యులార! 3

తా. ఈపద్యముంబట్టి తాత పాముమంత్రము వేయు నట్లును, తండ్రి స్త్రీలుపడు ప్రసవ వేదనను మాన్పునట్లును, అన్న పశుచికిత్సలు తెలిసియున్నట్లును తనకువైద్యప్రశంసతెలిసి యున్నట్లును తేలుచున్నది.

క. చేయఁగబూనితి సూత్ర
ప్రాయంబుగ వైద్యశేఖర కృపచేదీనిం
దోయధిదాటిన ఘనకపి
రాయనికడఁ గుప్పిగంతు రమణదలిర్పన్. 4

తా. సూత్రప్రాయముగా వైద్యశిఖామణుల కృపచే నీగ్రంథమును వ్రాయు చుంటి ననియు, సముద్రము దాటిన ఆంజనేయునియొద్ద కుప్పిగంతులువైచినట్లుపెద్దపెద్దవైద్యగ్రంథ ములలో నిదియెంతయని వినేయతను గనపరచెను.

సీ. చంద్రుండులక్ష్మియుచైత్రశవంబునుసుర
కరియును నమృతంబుఁగల్పకంబు

గౌస్తుభమణియాదిగాఁగల్గుసత్సము
త్కరముతోడనుబాలకడలియందు
ఘనుఁడుభిషగ్గుంసయనువునవిష్ణువ
జ్ఝులకులసత్కలశజలనిధికి
నోషధీశుండయియుదయించిసంగమే
శ్వరభిషజుఁడురాజవైద్యనిపుణుఁ
గీ. డతఁడునామాతులుండౌటనందునాకుఁ
గొన్నికొన్నిచికిత్సలుకుదురుపడఁగ
నలవడియెమేనమామపోల్కలుగనిందు
వ్రాయదొరకొంటిసజ్జనవ్రాతమలర. 5

తా. పాలసముద్రములో, చంద్రుఁడు, లక్ష్మి, ఉచ్చైః శ్రవము, తెల్లయేనుఁగు, అమృతము, కల్పవృక్షము, కౌస్తుభమణి మొదలైనవానితోఁగూడఁ బుట్టినధన్వంతరివలె, విష్ణువజ్ఝులవంశమను పాలసముద్రమునకు, చంద్రునివంటివాఁడును రాజవైద్యుఁడును, సంగమేశ్వరనామముగలయతఁడు మేనమామయగుటచే మేనమామపోల్కలు కొన్నియబ్బి యీగ్రంథము వ్రాయఁగడంగితిని.

ఉ. వ్రాసిరితొంటిసత్కవులువైద్యవిదుల్ ఘనవైద్యశాస్త్రము
ల్చేసిరితొంటివెజ్జులువిశేషగుణప్రదమైనమందులం
బూసకుఁబూసఁగుచ్చుగతిఁ బోలఁగఁజూపక వేఱువేఱుగా
రాసియొనర్తురయ్యదిభరంబుగదాకను వారికెప్పుడుఁ. 6

తా. వైద్యముతెలిసిన పూర్వకవీశ్వరులు పెద్దపెద్ద

వైద్యగ్రంథములను వ్రాసిరి. వైద్యులును గొప్పగొప్ప గుణమిచ్చు నౌషధములం జేసిరి. వేలువేలుగాఁ జూపక నన్నియు నేకరాసిగానుంచుటచే చూచువారికి చాలభరముగానుండును.

గీ. మినుములును బెసలుకందులు ననుములునొక
గుప్పయొనరిచి యేర్చిడిచొప్పుగాదె
యన్ని విషయములొక గ్రంథమందె వ్రాసి
విషయసూచికఁగనుగొని వెదకుటెల్ల 7

తా. అన్ని సంగతులు ఒక్క గ్రంథమందు కుప్పఁగాఁ జేర్చిపెట్టి కావలసినవిషయమును గ్రహించుటకు విషయసూచిక వెదకుట యెట్టిదనఁగా, మినుములు, పెసలు, కందులు, అనుములు ఏకముచేసి ఒకరాసిపోసి కావలసినదాని నేర్చుకొనుటవంటిది.

ఉ. అద్దిర! యట్లుసేయకయె యాంగలమందు నొకొక్కదానికిం
బెద్దగ్రంథరాజముల వేలుగ వేలుగ వ్రాసియుండుటం
దద్దయులాభకారులుగ దాయనినేనును దత్పథంబునన్
ముదులుగుల్క వ్రాయుటకు బూనితిఁ బెద్దలయొద్దఁబిన్ననై.

తా. ఆంగ్లేయభాషలో నట్లుసేయక ఒక్కొక్కవిషయమున కొక్కొక్కగ్రంథమును వేలువేలుగా వ్రాసియుండిరని నేనును, ఆదారిని వ్రాయ యత్నించితిని.

క. ఒక్కొక్కయవయంబున
కొక్కొక్కటివ్రాసినట్టి హయాణులవలెనే

నొక్కొక్కరుజకు వేఱుగ
నొక్కొకగ్రంథంబు వ్రాయ నూహసలిపితిఁ. 9

తా. ఆంగ్లేయభాషలో, ఒక్కొక్క అవయవమునకొక్కొక్క గ్రంథము వ్రాసినట్లే నేను, ఒక్కొక్క రోగమునకొక్కొక్క గ్రంథము వ్రాయ నూహించితిని.

ఉ. ఊహజనించినంతటనె యూరకయుండిన నేమిలాభమా
నీహజనించికబ్బముల నెన్నిటినో రచియింపఁ బ్రాజ్ఞసం
దోహముసాహసింపవలె దుర్భరమైననలంతియైననం
చాహరిరాయఁ బూర్ణహృదయంబుననమ్మిచు వ్రాయఁ
బూనితిఁ. 10

తా. తలంపుపుట్టినపిమ్మట కష్టమైనం దేలికయైన నూరకుండుటతగదని, కృతీశ్వరుఁడగు వాయునందనుని నమ్మి వ్రాయఁబూనితిని.

---

# కర్మవిపాకము.

---

క. ఏపుననుత్తమజాతి
స్త్రీపంచశరప్రవృత్తి శిరమునఁ గురుపుల్
ప్రాపించునందులకుఁ బ్రా
జాపత్యవ్రతముమేలు సమకూర్చఁగదుఁ. 11

తా. ఉత్తమజాతి స్త్రీతోఁ గ్రీడించుటఁజేసి శిరస్సునఁ గురుపులు పుట్టును; దీనికి ప్రాజాపత్యవ్రతము సేయవలయును.

చ. నలువుగఁబుణ్యకర్మల నొనర్చెడిపట్లను గోళ్ళగార్ధభం
బులఁగనుగొన్న హేతువున బుట్టును తప్పక నాశికావ్రణం
బులుగడుఁదన్నివారణము పొందెడుమహత్తరమైన వేదరు
క్కులఁదగనన్నముఁ ఘృతముఁ గూరిమిహోమము సేసి
వెండియు 12

తా. పుణ్యకర్మలను జేయుసమయమున గోళ్ళను, గాడిదెలను చూచుటచే నాసికావ్రణంబులు జన్మించును. ఆపా పనివారణార్థము వేదరుక్కులచే నన్నమును నేయియు హోమము చేసి.

గీ. ఎలమిశ్రీసూక్తమును జపియించిశిఖను
మహితశంకరసంకల్పమంత్రితమగు
నక్షతలుగానిదూర్వాంబులైనఁగాని
తాల్పవలయును రక్షణార్థంబునరుఁడు. 13

తా. శ్రీసూక్తముపఠించి శివసంకల్పముచే మంత్రింపఁబడిన, అక్షతలనుగాని, దూర్వాంకురములనుగాని శిఖను ధరించవలయును.

# వ్రణలక్షణము.

క. వ్రణముదగున్శారీర
మ్మనియునునాగంతుకమనియందుఁగ్రమమునన్
జనియించువాతదోషం
బునశస్త్రాదికమువలనఁబొరినిరుతెగలై. 14

తా. శారీరమనియు, ఆగంతుకమనియు, వ్రణములు రెండువిధములు. అందు శారీరమ్ములు వాతదోషముచేతను, ఆగంతుకములు శస్త్రాదికమువలనను గలుగును.

చ. జడముగనుంట ముట్టుకొనఁ జట్టువలెన్గనుపించుచుంట యప్పుడప్పుడునొప్పియౌ మిగుల బొట్లుస్రవించుచునుంటనల్లగా
గుడమువిధంబుగాఁగఁగనుబడుచుండుట గల్గియుండినం
దడయకవాతజవ్రణము తప్పదటంచు నెఱుంగఁగావలెన్.

తా. కదలికలేనిదై ముట్టుకొనినయెడల రాయివలెనుండి అప్పడప్పుడు నొప్పి, పోట్లుస్రవించుటగల్గి నల్లగా బెల్లపురంగు గలిగియుండినయెడల వాతమువలనఁ బుట్టినవ్రణమని తెలిసికొనవలెను.

ఉ. దప్పియు మోహముల్ జ్వరముదాపముచెమ్మటచీల్చునట్లుగా
నొప్పిస్రవించుచుండుటయు నుంజెడువాసన గల్గియుండినం
దప్పకపిత్తజవ్రణ విధంబనియెంచుచు వైద్యులెల్ల నేఁ
జెప్పినయౌషధంబులను జేసిచికిత్సలుసేయుటొప్పగున్. 16

తా. దాహము, మోహము, ఉష్ణము, తాపము, చెమట, చీల్చుచున్నట్లు నొప్పి స్రవించుట, వాసనగల్గి యున్న యెడ పైత్యమువలన పుట్టినవ్రణమని యెంచి నేనీ గ్రంథమునం జెప్పిన ఔషధములను జేసి వైద్యులు చికిత్సఁ జేయుట తగును.

గీ. జడము దట్టముజిగట నిశ్చలమునొప్పి
పాండువర్ణముకొద్ది స్రావంబుఁగల్గి
పండుటకుఁ జేరకాలంబు పట్టెనేని
శ్లేష్మజవ్రణమంచును జెప్పఁబడును. 17

తా. జడత్వమును, దట్టము, జిగట, చలనము లేకుండుట, నొప్పి, పాండువర్ణము, కొంచెము స్రవించుట, ఇవి కలిగి పక్వమునకువచ్చుటకు చాలకాలము పట్టినయెడల శ్లేష్మము వలనఁ బుట్టినవ్రణమని చెప్పఁబడును.

సీ. చర్మంబునందు మాంసమునందుమర్మర
హితమైన తావులస్పృష్టియగుచు
నుష్ణంబుమిక్కిలి తృష్ణయు మొదలౌను
పద్రవరహిత యౌవనముగల్గి
వెలయ యుక్తాయుక్త వేచనగల్గిన
మనుజులకెందు హేమంతమందు
శిశిరంబునను జనించిననూతనవ్రణ
మ్ములు సుఖవ్రణసంజ్ఞఁ బొందియుండు
గీ. నట్టివ్రణములు సుఖసాధ్యమని యెఱింగి
భిషజులీగ్రంథమునను జెప్పినతెఱంగు

తప్పకుండంగదగు చికిత్సలొనరించి
వాసిఁగాంచుటమేలు భూవలయమందు. 18

తా. చర్మమునందును, మాంసమునందును, మర్మస్థలములయందును బుట్టి, ఉష్ణము, దాహము, మొదలయిన ఉపద్రవములేని యౌవనముగలిగి యుక్తాయుక్త వివేచనయుండిన మనుజులకు హేమంతశిశిర ఋతువులందుఁ బుట్టిన నూతన వ్రణములు సుఖవ్రణము లనఁబడును. అట్టివ్రణములు సులభసాధ్యములని గ్రహించి వైద్యులు ఈగ్రంథమందుఁ జెప్పినరీతి తప్పక చికిత్సలుజేసి పేరుగాంచుటమంచిది.

గీ. చెడినరక్తంబుఁ గుళ్ళిన చీముగలిగి
వ్రణముళోపల గుల్లయై పయినుబ్బి
కడువికారంపు వర్ణంబుఁ గలిగియుండు
సాివవేదనతోడ దుష్టవ్రణంబు. 19

తా. చెడిన రక్తముతోను, కుళ్ళిన చీముతోను ఉండి, లోపలగుల్లయై పయికి ఉబ్బినట్లుండి మిక్కిలి వికారపురంగుగలిగి సాివబాధగలిగియుండునది దుష్టవ్రణము.

మ మొనవిస్పష్టముగాఁగనుండుటయు వాపుంబోట్లులేకుంటజిహ్వానుహస్తంబునుబోలియుండుటవపుర్వక్త్రుల్యవర్ణంబుగల్గినదై యుండుటఁబక్వమైవ్రణముచికిత్సాసాధ్యమానింకనంచునువైద్యంబొనరించిమానుపఁగవచ్చుఁ వైద్యులెప్పట్టు
నక. 20

తా. మొనతేరియుండుట, వాపు, పోట్లులేకుండుట, నాలుకను, చేతిని పోలియుండుట, దేహముయొక్క చర్మము రంగుతో సరిగానుండుట గలిగియున్నయెడల వ్రణము పక్వమునకు వచ్చినదని తెలిసికొని వైద్యులు వైద్యముచేసి మాన్పవచ్చును.

గీ. క్షయయు, మధుమేహకుష్ఠు విషములుగల్గి
బాధపడుమర్త్యునకుఁ బుట్టువ్రణము, వ్రణము
మీఁదసింకొకవ్రణము జన్మించెనేనిఁ
గష్టసాధ్యమనుచు నెఱుఁగంగవలయు. 21

తా. క్షయ, మధుమేహము, కుష్ఠు, విషములు, ఇవికలిగి బాధపడుచుండు మనుష్యునకుఁ బుట్టిన వ్రణమును, వ్రణముమీఁద వ్రణముబుట్టినను కష్టసాధ్యమని తెలిసికొనవలెను.

గీ. అగరుచందన కమలపుష్పాజ్య మద్య
గంధఫల్యాది వస్తుసుగంధతుల్య
సౌరభంబులు గలుగ నసాధ్యమగుట
కాక నావ్రణమున మృతిగల్గునిజము. 22

తా. అగరువలెను, మంచిగంధము వలెను, కమలము వలెను, పూవువలెను, నేయివలెను, కల్లువలెను, సంపెంగవలెను వాసనపుట్టినయెడల అసాధ్యమగుటయేగాక, అవ్రణమువలన మరణముకూడ సంభవించును.

గీ. వాతదోషంబున విషమపాకమగుచుఁ
బైత్యదోషమునను శీఘ్రపక్వమగుచు

కఠిన కఫదోషమునఁ జిరకాలపక్వ
మగుచు దేహిని వ్రణములు నొగులఁజేయు. 23

తా. వాతదోషముచేత విషపక్వము గలవియు, పైత్యదోషమున శీఘ్రపక్వముగలవియు, కఫదోషమునఁ జిరకాలపక్వము గలవియునై వ్రణములు మనుజుని బాధించును.

క. చనురక్తాగంతుకమగు
వ్రణమది పిత్తవ్రణంబువలెశీఘ్రముగం
గనుబక్వము భిషజులుచ
య్యనని భేదములనెఱుఁగనగునెవ్వేడలన్. 24

తా. రక్తాగంతుకమైన వ్రణము పైత్య వ్రణము వలె శీఘ్రపక్వమునుబొందును. ఈభేదమును వైద్యులు తెలిసికొని యుండవలెను.

గీ. వాతమునఁబోట్లు పిత్తము వలనఁ బక్వ
మగుట కఫమునఁ జీముగలుగుటసాజ
మనిభిషక్కులుతెలిసి వైద్యంబుసేయ
నగును లేకున్ననది యసాధ్యంబుజగతి. 25

తా. వాతమువలన పోట్లును, పైత్యమువలన పక్వమునకువచ్చుట, కఫమువలన చీముపట్టుట, ఇవిసహజమని వైద్యులు తెలిసికొని వైద్యము సేయవలయును గాని లేకపోయిన ధ్యముకాదు.

క. వ్రణముల పక్వాపక్వము
లనుబాగుగ గుర్తెఱింగి లక్షణయుక్తం

బునుశాస్త్రసమ్మతంబై
చనునట్టిచికిత్స సేయ సాధ్యంబరయన్. 26

తా. వ్రణములు పక్వమునకు వచ్చినదియు, లేనిదియు, బాగుగాఁ దెలిసికొని, లక్షణ యుక్తమై శాస్త్రసమ్మతమైన చికిత్స జేయుట సాధ్యము.

క. పక్వముగాని వ్రణంబును
బక్వమయినదంచుఁ జెదుపువాఁడునుమఱియుం
బక్వంబైనవ్రణంబును
బక్వముగాదనెడునతఁడు బాలిశులెందున్. 27

తా. పక్వముగాని వ్రణమునుపక్వమునకువచ్చెనని చెదుపువాఁడను, పక్వమునకు వచ్చిన వ్రణమును పక్వమునకు రాలేదనువాఁడును, మూఢులు.

---

## వ్రణచికిత్సలు.




గీ. కటుకరోహిణి జిల్లేడు కడిమిజువ్వి
రావిప్రబ్బలియుఁ గరవీరమును మట్టి
యత్తియును పీనిదాగపాయమును బెట్టి
కడిగినంబుండ్లుమానును గపివరేణ్య 28

తా. కటుకరోహిణి, జిల్లేడు, కడిమి, జువ్వి, రావి, ప్రబ్బలి, గన్నేరు, మఱ్ఱి, అత్తి, వీనిచెక్కలతో కషాయమును బెట్టి పుండ్లను కడిగినచో, మానును.

గీ. కప్పురము నింగిలీకము గవ్వపలుకు
మంచిసాంబ్రాణి యివిమూఁడు మైనమువలె
నూరిపట్టించినను సౌఖ్యమేరుపడఁగ
నెట్టిమేహవ్రణంబులు నేనిమాను. 29

తా. కర్పూరము, ఇంగిలీకము, మంచి గవ్వపలుకు సాంబ్రాణి యివిమూఁడును మైనమువలెమెత్తగానూరిపట్టించిన యెడల, ఎట్టిమేహవ్రణములైనను మానును.

గీ. కరకకాయయుఁదాడి యుసిరికకాయ
యునుగషాయంబుగం దీసియొనరగుగ్గి
లంపుజూర్ణముతోఁ ద్రావఁగంపుస్రావ
పక్వములుఁబోట్లుఁగల పుండ్లవాపులడగు. 30

తా. కరకతాడి యుసిరికలను ఈమూటిని కషాయముతీసి గుగ్గిలపుచూర్ణముతోఁగలిపి త్రానిన యెడల కంపు, స్రావముఁ పక్వము, పోట్లుగలిగియున్న కురుపులయొక్క వాపులు తీయును.

ఆ. మునిఁడిపండుగుంజు వసజమ్మియాకును
మిరియములును సరిగమేకపంచి
తమునరూరిరాయఁ దగునుపైత్యవ్రణ
ములకుఁదానమేలు గలుగఁగలదు. 31

తా. మునీఁగపండుగుంజును, వస, జమ్మియాకు, మిరియములు సమానముగా మేకపంచితముతో నూరి రాచినయెడల పైత్యవ్రణములుమానును.

గీ. రోకఁటినిదంచికొని పెద్దటేకుపట్ట
కాంజికముతోడనూరి కల్కముగఁ జేసి
పూయవాతవ్రణమ్ములు పూఁటలోన
మూడుగట్టుచువెంటనే మానఁగలవు. 32

తా. రోకలితో పెద్దటేకుచెక్కనుదంచి యుంచుకొని కలితో (తరవాణి)నూరికల్కముగాఁ జేసి పూసినయెడల వాతవ్రణములు పూటకుమూడుగట్టి మానిపోవును.

సీ. తెలుపైనపల్కుగుగ్గిలము తులంబును
గలువమునకునూరి తులముహింగు
ళమునుమయూర తుత్థమరతులంబుపెం
కునునుబొంగఁగఁ జేసి గుండగొట్టి
మైలుతుత్థపుపొడి మఱిగుగ్గిలపుఁబొడి
రెండునుగల్పి యేరండతైల
మునసుడికించియందున నింగిలీకపు
చూర్ణముఁగల్పి యుంచుక వ్రశస్త

గీ. మైనమైనంబుఁ జేరిచి యదిజిగురుగ
వండిగుడ్డకుఁబట్టించి వ్రణముమీఁద
వేయవాతవ్రణంబుల వేగఁగోసి
కలుషమునుదీసివైచి సౌఖ్యంబొసఁగు. 33



తా. తెల్లని పల్కుగుగ్గిలము కలువములో నూరియుంచుకొని, ఒకతులము ఇంగిలీకము, అరతులము మయూరతుత్థము ఇవి రెండును పెంకులోవేసి పొంగించి గుండకొట్టి, మైలుతుత్థపుపొడి, గుగ్గిలపుపొడి రెండును గలిపి, ఆముదమున నుడికించి, అందు ఇంగిలీకపుపొడి గలిపి కొంచెముమంచిమైనమును జేర్చి అదియంతయును జిగురు వచ్చునట్లు వండి గుడ్డకు పట్టించి వాతవ్రణముల కంటించినయెడల వేగముగాఁగోసివైచిలోపలనున్న కల్మషమును దీసివైచి సౌఖ్యమొసంగును.

## వ్రణములు పగులుటకు చికిత్సలు.

క. ఏనుఁగుదంతము చిక్కఁగఁ
బానీయంబులనునూరి పట్టించిననెం
తేసిఁగఠినముగు వ్రణముం
గానిదినములోనఁ బగులఁగలదు మహాత్మా 34

తా. ఏనుఁగుదంతమును నీళ్లతో చిక్కగా నుండునట్లు అరగఁదీసి పట్టించిన యెడల ఎంతకఠిన వ్రణములైననుదినములో పగులును.

గీ. మిరియములుఁ బావురపుపెంట సరిగనూరి
కట్టినను బేడయుడికించి కట్టుచున్నఁ
బదిదినములకు సెలపుండు బలముతగ్గి
మానిసౌఖ్యంబొసంగును మనుజునకును. 35

తా. మిరియములు, పావురపు పెంటికలు, సమానము గానూరి కట్టినను, పేడ ఉడికించికట్టుచున్న నుపదిరోజులలోనెల పుండుబలముతగ్గిమానిమనుజునకు సౌఖ్యమిచ్చును.

గీ. యవలుగోధుములును నూరియందు క్షార
ముంగలిపిపూసినను సున్నమును బసపు బ
సుమమునంగల్పిరాచిన నిమిషముననె
వ్రణపటుత్వంబు దగ్గుచుఁ బగులఁగలదు. 36

తా. బియ్యము, గోధుములు నూరి అందు ఉప్పుగలిపి రాచినను సున్నము పసపుపొడిగలిపి రాచినను నిమిషములో వ్రణముయొక్క గట్టితనముపోయి పగులును.

గీ. మేకపెంటికబూడిద మెత్తగాను
నూరిసాంబరి లవణంబునుం గలుపుచు
లేపనముసేసిరేనియు నేపుదగ్గి
వ్రణముజామగునంతకుఁ బగులఁగలదు. 37

తా. మేకపెంటికలు బూడిద మెత్తగా నూరి, అందు సాంబరలవణమునుగలిపి పూసినయెడల వ్రణము యేపుతగ్గి జాములోఁబగులగలదు.

గీ. నల్లమందాముదపుబప్పు నలుగఁగొట్టి
మెత్తఁగానూరి గడ్డలమీఁదరాయఁ
బదినిముసములకుంబుండు పగిలిబాధ
సర్వము నివారణంబయి సంతసమిడు. 38

తా. నల్లమందును, ఆముదపుపప్పును నలుగఁగొట్టి మెత్తగానూరి గడ్డలమీఁద రాచినయెడల పది నిముసములలో పుండుపగిలి బాధనివారణమగును.

గడ్డతేలుటకు.

క. కలబందరసమునను మెం
తులు బియ్యము గోధుమలును నూరిమఱియుని
ర్జలమగు నవనీతంబును
గలిపియిడిన వేగముగను గడ్డలు దేలున్. 39

తా. కలబందరసముతో మెంతులు, బియ్యము, గోధుమలునునూరి నీరులేని వెన్నలోఁగలిపి పట్టించినయెడల వేగముగా గడ్డలుతేలును.

కంతికరగుటకు.

సీ. గంగసిందూరము నింగిలీకము రస
సింధూరమునుమఱి చిత్రమూల
మును రసకర్పూరమును నొక్కటొకటి తు
లమ్ముఁ బండ్రెండు తులములుమైన
మునసుడికించుచుఁ బుల్లనుగదపి పా
కమురాగనదిదించి కంతియెంత
పరిమితినుండు నాపరిమాణముగఁ బిళ్ళ
వలెఁజేసి యది వెచ్చపరచి దానిఁ
గీ. గంతిపయినిడి మీఁదఁదగరపుబిళ్ళ
పైచికట్టుచునుండిన వరుసగాను

బదిదినంబులలోపల బరువుతగ్గి
వెంటనే కంతికరగును విస్మయముగ. 40

తా. గంగసిందూరము, ఇంగిలీకము, రససిందూరము చిత్రమూలము, రసకర్పూరము ఇవి ఒక్కొకటి తులము చొప్పున నూరి పంద్రెండుతులముల మైనముతో నుడికించి పాకమునకు రానిచ్చి దించి కంతికి సరిపడిన బిళ్ళచేసి, అది వెచ్చజేసి కంతిమీఁదఁబెట్టి దానిమీఁద తగరపుబిళ్ళను వేసి పదిదినములు వరుసగా కట్టినయెడల కంతిచిత్రముగా కరగిపోవును.

మడమశూలకు.

సీ. పాలతోనుడికించి వరిపిండికట్టును
గట్టిరేనియు దబ్బకాయకుమ్ము
నంబెట్టియుడికించి నలిపికట్టునుగట్టి
రేని చౌడును నీటనాననిచ్చి
కట్టుగట్టిరయేనిఁ గల్వంబునను నగ్ని
మూతనుమర్దించి రాతిసున్న
మునుగల్పి నూరి కట్టునుగట్టిరేనియుఁ
దడయక క్షణములో మడమశూల
గీ. పోటునిశ్శేషముగమాని పూర్వపుస్థితి
నాల్గుదినములలోఁగల్గి నడచునట్టి
ధైర్యమొనఁగును గావునఁదప్పకుండ
వైద్యులీరీతిఁజేసి పేర్వడయుటొప్పు. 41

తా. వరిపిండిపాలతో ఉడికించి కట్టుగట్టినను, దబ్బకాయ తుమ్మలోఁబెట్టి ఉడికించికట్టుగట్టినను, చిత్రమూలమును నూరి రాతిసున్నముం గల్పికట్టుగట్టినను, మడమశూలపోట్లు క్షణము లోమాని యథాప్రకారముగా నాలుగు దినములలోనడచు నట్టిశక్తి కలుగును. కాఁబట్టివైద్యులీవిధముగా చికిత్సలను జేసి పేరుగాంచుటతగును.

పంగలమాదకు.

సీ. చౌడుతడిపికట్టి చలినీళ్ళుబోసినఁ
బులిచల్లతోడను దెలకపిండి
యనువుగానూరికట్టిన లకుచఫలంబు
నుడికించికట్టిన నుదయమునను
దరవాణియన్న మింతపిసికికట్టినఁ
బెద్దబచ్చలియును బెరుగునూరి
కట్టిన వెన్నయుఁ గదళీఫలంబును
గలిపికట్టినఁబోటు గడియలోన
గీ. మానుటయెగాక పంగలమాదవలని
బాధయెన్నఁటికిని లేకబాగుపడును
పూర్వరీతిని జర్మంబువోయు మరలఁ
దప్పకుండఁగ నీచికిత్సలసలుపుఁడు. 42

తా. చవుడుతడిపికట్టి చలినీళ్ళుపోసినను, పులిమజ్జిగ తో తెలకపిండి నూరికట్టినను, నిమ్మకాయ ఉడికించి కట్టినను,

ఉదయపుప్పూట తరవాణియన్నము పిసికికట్టినను, పెద్దబచ్చలి యాకు పెరుగునూరి కట్టినను, వెన్నయు అరటిపండును గలిపి కట్టినను గడియలోఁ బోటు మానుటయేగాక, ఎన్నఁటికినిమర ల నట్టిబాధలేకుండ పంగలమాదమాని యొప్పటియట్లు చర్మ ము తోడుగునుగాన తప్పక ఈచికిత్సలు సేయవలయును.

ఉడుకుసర్పికి.

గీ. వెలిమిడినిదాల్చి మజ్జిగవేసికలిపి
లేపనముసేయఁ దెల్లజిల్లెడుసుగంధి
జీరకంబులురెండును నూరినేయి
గలిపిరాచిన నుడుకు సర్పాలుహరించు. 43

తా. తాల్చినవెలిమిడి, మజ్జిగవేసికలిపిపూసినను, తెల్ల జిల్లేడు, సుగంధి, నల్లజీలకఱ్ఱ, తెల్లజీలకఱ్ఱ, ఇవినూరి నేతితోఁ గలిపి రాచినను, ఉడుకుసర్పాలుమానును.

గీ. ఉడుకుసర్పివలన బాధపడుచునున్నఁ
గాకిదొండాకుపసరు జిక్కఁగనుదీసి
యావునేతనుగలిపి పూయంగదాని
బాధనిశ్శేషముగమాను బ్లవగవర్య. 44

తా. ఉడుకుసర్పివలన బాధ ఎక్కువుగా నున్నప్పుడు కాకిదొండాకు పసరుదీసి, ఆవునేతిలోఁగలిపి పూసినయెడ నిశ్శే షముగా మానును.

## సర్పికి.

సీ. కొండకసింతయు రెండుజీరకములుఁ
బాలసుగంధియు నేలకులును
మానేరుచెక్కయు మంచిమిరియములుఁ
దాడియుఁదెల్లజిల్లేడుచెక్క
యరతులమరతుల మగునట్లుచూర్ణంబుఁ
జేసిగోఘృతమందుఁ జేర్చియొక్క
మోతాదుఁదినియొక్క మోతాదుకురువుల
కునురాచినను మూఁడుదినములకును
గీ. మంటయును బచ్చియునుగూడ మానిమాఁడి
దేహమెప్పటియట్లులఁ దేజరిల్లు
సర్పికిదిచేరువానిి యౌషధముగాన
వైద్యులిబ్భంగిఁజేసిన వాసిగలుగు 45

తా. కొండకసింత, నల్లజీలకఱ్ఱ, తెల్లజీలకఱ్ఱ, పాలసుగంధి, ఏలకులు, మానేరుచెక్క, మిరియములు, తాడి, తెల్లజిల్లేడుచెక్క, ఇవి అరతులము అరతులము అగునట్లుచూర్ణము జేసి ఆవునేతిలోఁగలిపి, ఒక్కమోతాదులోపలికి పుచ్చుకొని ఒకమోతాదు కురుపులకురాచినయెడల మూఁడుదినములకు మంట, పచ్చి ఇవిమాని మాడిపోయి శరీరము మొదటివలె నగును. ఇది సర్పికి మంచియౌషధము కాఁబట్టి వైద్యులీవిధముగాఁజేసిన యెడల ప్రసిద్ధిగలుగును.

క. చెంబాకు రసమునమిరి
యంబులువసనాగముసీఁడి యరుగంగాఁ గ
ల్వంబునమెత్తగనొనరిచి
గంబూరంగల్పిరాయఁగా సర్పివిడుఁన్. 46

తా. చెంబాకురసముతో మిరియములు, వస, నాగముసీణిగ, ఇవి కల్వములో మెత్తగానూరి కర్పూరముగలిపి రాచినయెడ సర్పి విడిపోవును.

నాడీవ్రణమునకు (నారికురుపు)

సీ. రసముగంధకమువీని సమంబుగనునూరి
దానికిసరిగ ముదారుసింగు
కలిపియన్నిఁటిని జక్కఁగనూరిదాని ప
రిమితినిగంప్పిల్ల ముమటికొంచె
ముగమైలుతుత్థమును గలిపినూరి దా
నికినాలుగింతలు నేయిజేర్చి
దానిలోదూదిని దడపివ్రణంబుపై
ననిడినదుష్టవ్రణములుమఱియుఁ
గీ. దీవ్రబాధానమేత నాడీవ్రణములు
నిమిషమునకెగుణాచిచ్చి క్రిముము గాను
నాగముదినంబులకు మానుపట్టి సౌఖ్య
మొసఁగునీయౌషధమును జేయుట శుభంబు. 47

తా. పాదరసము, గంధకము, వీనినిసమానముగామర్దించి ఆరెంటికి సరిగా ముదారుసింగునుకలిపి అన్నిటినికలిపిమర్దిం

చి ఆమర్దించినదానియంత ములుమోదుగచూర్ణమును, కొం చెముమైలుతుత్తమునుగలిపిమర్దించి ఆమర్దించినదానికి నాలుగు రెట్లు నేయిగలిపి దానిలోదూదినిదడపి వ్రణంబుపైనవేసినయె డల దుష్టవ్రణములు,ఎక్కువబాధపెట్టునారికురుపులు శీఘ్రము గాగుణమిచ్చి వారముదినములలో మానుపట్టి సౌఖ్యమిచ్చును కాఁబట్టి ఈయౌషధమును జేయుట దీనికిముఖ్యము.

ఎదురుకుతిక-కరిణిమూలకు.

గీ. సమముగాఁగను శొంఠిగంధమునవిసి
యాకుపసరునుగలిపి వేయఁగనెదూది
దీసియంటింపనెదురు కుతికలుఁగరిణి
మూలలునుశాంతినొందుచు ముదమొసంగు. 48

తా. శొంఠిగంధము, అవిసి ఆకుపసరు సమానముగా గలిపి చేసి దానిమీఁదదూదినంటించినయెడల, ఎదురుకుతికలు- కరిణిమూలలు మాని మోదమిచ్చును.

కల్ల వాపునకు.

గీ. సమముగా దుప్పికొమ్ము గంధమునుశొంఠి-
మంచిసాంబ్రాణిచనుబాలనుంచినూరి
పట్టువేసినయెడఁగల్ల వాపుశీఘ్రి
ముగనుమానిసుఖంబు నొసఁగుమహాత్మ. 49

తా. దుప్పికొమ్ముగంధము, శొంఠి, సాంబ్రాణి చను బాలతో నూరి పట్టువేసిన యెడల కల్లవాపు శీఘ్రముగా మానును.

బిళ్ళలకు

సీ. కలువంబునందున ములగచెక్కరసంబు
రాతిసున్నమును మర్దనయొనర్చి
రాచిరయేనియు, రాతిసున్నముం గోడి
గ్రుడ్లసొనయు రెండుం గూర్చిపట్టి
వేసిరయేని సువాసనగల మసాం
బ్రము గుగ్గిలముశొంఠి సమముగాంగ
మైనంబుతోవండి మంచితెల్లనిగుడ్డం
బట్టించిబిళ్ళపైం బట్టువేయ

గీ. నెట్టి కఠినంపుబిళ్ళలు నేనిం గఱగి
నరమునొప్పియు లేకుండం దిరముంపడును
గాన వైద్యులు రోగులుం గ్రమముతప్ప
నీయకుండం జికిత్సను సేయుటొప్పు. 50

తా. ములగచెక్కరసము, రాతిసున్నము, ఈరెండును కలువమున నూరి రాచినను, రాతిసున్నము, కోడిగుడ్లసొన రెండునుగలిపి పట్టువేసినను, మంచి మసాంబ్రము, గుగ్గిలము శొంఠి, సమముగా మైనముతోవండి గుడ్డకుపట్టించి బిళ్ళపైప ట్టువేసినను, ఎటువంటి కఠినపుబిళ్ళలయినను కఱగిపోయి నర మునందు నొప్పికూడ లేకుండం బోవును. కాంబట్టి వైద్యులు రోగులు ఈచికిత్సలను మానక చేయవలెను.

## గాలిబిళ్ళలకు.

ఆ. అవిసెయాకుపసరు నటించియామీఁద
గాలిదగులకుండఁ గట్టిగాను
దూదినద్దిరేని తోడనేగాలి బి
ళ్ళలుహరించి సుఖముగలుగఁజేయు. 51

తా. అవిసెయాకు పసరునుబట్టించి దానిమీఁద గాలి దగులకుండునట్లు దూదిని వత్తుగా అంటించినయెడల వెంటనే గాలిబిళ్ళలు నశించును.

## చనుకుదురునకు.

క. చనుకుదురు శొంఠిగంధం
బును బాలనునూరివేయఁ బోవునుగానం
జనువైద్య శిఖామణులిది
ఘనవైద్య చికిత్సయంచు గణుతింపవలెన్. 52

తా. శొంఠిగంధమును పాలతోనూరి పట్టించినయెడల చనుకుదురులు నివారణయగును. కాఁబట్టి దీనిని వైద్యులందఱును, గొప్పచికిత్సగాఁ దలంపవలెను.

## రొమ్ముకుంపటికి.

గీ. రొమ్ముకుంపటిచే బాధయుమ్మరమయి
నపుడు జిల్లేడుపూవును నావుపాల
తోడనుడికించి యొకరెండు మూఁడుకట్లు
గట్టినను నాలుపోటును గట్టువేగ. 53

తా. రొమ్ముకుంపటివలన బాధయెక్కువగా నున్నప్పు డు జిల్లేడుపువ్వును ఆవుపాలతో ఉడికించి రెండుమూఁడుకట్లు గట్టినయెడల ఆటు, పోటుతగ్గును.

గీ. పిమ్మటను జేదుపుచ్చను గుమ్ములోనఁ
బెట్టి యాముదముననూరి కట్టుగట్టి
రేనియొకకట్టునకె మాయమైనభంగి
రొమ్ముకుంపటి వేగ నిర్మూలమగును. 54

తా. తరువాత చేదుపుచ్చకాయ కుమ్ములోఁ బెట్టి, ఆ ముదముతో నూరి కట్టుగట్టినయెడల ఒక్క కట్టునకే రొమ్ము కుంపటి నశించిపోవును.

ఒడిసెపాలగడ్డలకు.

గీ. ములగచెక్కను లప్పగా నలుగఁగొట్టి
గట్టిగుడ్డను జేరిచి కట్టిసెగను
బెట్టియాముదమునఁ గాపువెట్ట నొడిసె
పాలగడ్డలు దినములోపలనె కఱఁగు. 55

తా. ములగచెక్కను ముద్దగా నలుగఁ గొట్టి గట్టిగుడ్డ లో వేసికట్టి నిప్పుసెగనుబెట్టి, ఆముదముతో కాపుబెట్టినయె డల ఒడిసెపాలగడ్డలు ఒకదినములో కఱఁగిపోవును.

గండమాలలకు.

గీ. ఆవనూనె సరిద్వారి దేవకాంచ
నంబును సమానముగను గల్వంబునందు

మెత్తగానూరిపట్టింప మెడనుగల్లు
గండమాలలుమానును గవివరేణ్య. 56

తా. ఆవనూనె, నదిలోనినీరు, దేవకాంచనము ఇవిస మానముగాఁ గల్వమునవైచి నూరిపట్టించినయెడల మెడయందుఁబుట్టు గండమాలలుమానును.

గీ. గంధకముఁ బాదరసమును సైంధవలవ
ణమును సమముగ నర్కదుగ్ధములఁ గనక
మూలరసమున మదిఁచి పూసిరేని
గండమాలలు మాను దత్క్షణమెమాడి. 57

తా. గంధకము, పాదరసము, సైంధవ లవణము ఇవి సరిగా జిల్లేడుపాలతోను, సంపెంగ వేళ్ళ రసముతోను మదిఁంచిపూసినయెడల వెంటనేమాడిపోయి గండమాలలుమాడిపోవును.

మూలశంకవ్రణమునకు.

గీ. పచ్చిపెన్నేరు నుడికించి పంచదార
పేరినఘృతంబు దానఁ గల్పికొనితిన్న
మూలరోగవిరేచనములును రక్త
పతనమునుగట్టుఁ బిమ్మట జతనముననను. 58

తా. పచ్చి పెన్నేరుదుంపను ఉడికించి, అందులో పంచదార, పేరిన నేయి కల్పుకొని తినినయెడల మూలశంక వల

నఁబుట్టిన విరేచనములును, రక్తస్రావమును గట్టును. తరువాత—

గీ. రాత్రినిద్రించునప్పు డేరండతైల
మును గుదంబుననిడి బహిర్భూమికేఁజని
కడుగుకొని పిమ్మటను వసగంధము గూద
మునను దోఁపుచు నిరువది దినములున్న. 59

తా. రాత్రినిద్రపోవునపుడు ఆముదమును గుదస్థానమునబట్టించి బహిర్దేశమునకు వెళ్ళి శుభ్రముగా కడుగుకొని తరువాత వసగంధము గుదమందుదోపుచు నిరువది దినము లుండిన యెడల.

క. మూలవ్యాధిని గుదమునఁ
దేలిన మేహంపుగ్రిము లతిత్వరగా ని
ర్మూలమగుఁబుండ్లు మానును
జాలగనారోగ్యమబ్బు సత్యముదీనక. 60

తా. మూలవ్యాధిచేత గుదస్థానమందుఁబుట్టిన మేహపు పురుగులు మిక్కిలివేగముగాపోవును. ఇంతియగాక పుండ్లు మానును. మిక్కిలి ఆరోగ్యము.

గోరుచుట్టునకు.

క. పసపును సున్నంబును రెం
డుసమానంబుగను నలారి డొప్పవలెనొన

ర్చి సరిగనఖమునఁ జుట్టును
ముసరనిడిన గోరుచుట్టు పోకాడు వెసఁగ. 61

తా. పసుపు, సున్నమును, ఈ రెండును సమానముగా మర్దించి డొప్పవలె జేసిసరిగగోటిచుట్టును క్రమ్మునట్లు అంటించి నయెడల గోరుచుట్టు శీఘ్రముగా మానును.

గీ. గోరుచుట్టయి వ్రేలుఁ బగులఁగఁగొట్టు
పోటునాటునుగలిగి నప్పుడొకయింత
గేదెపేడనుగట్టిన నాదినంబె
రక్తమువిరిగి బాధ సర్వమునుమాను. 62

తా. వ్రేలు పగులఁ గొట్టునట్టిబాధకలిగియున్నప్పుడు కొంచెము గేదె పేడను గట్టినయెడల, ఆదినంబుననే రక్తము విరిగి గోరుచుట్టు బాధయంతయును పోవును.

క. జంబీరఫలమునకుఁగ
న్నంబొనరిచి కరరుహంబునకుఁ దగిలింపం
గంబుకముం గట్టినఁగు
స్తుంబరిగట్టినను గోరుచుట్టులుమానుఁ. 63

తా. నిమ్మపండునకు కన్నముచేసి వ్రేలికిబెట్టినను, పెన్నరుగట్టినను, కొత్తిమీరికట్టినను గోరుచుట్లు మానును.

## నెత్తురుగడ్డలకు.

గీ. పాలలోపల వరిపిండిపాకముగను
వండి యాముద మించుకవైచిపిసికి

డిప్పఁగాఁజేసి గుడ్డఁగట్టినదినంబు
లోన నెత్తురుగడ్డలు దానఁజితుకు. 64

తా. పాలతో వరిపిండి మెత్తగావండి, కొంచెము ఆముదము గలిపి పిసికి, డిప్పవలెఁజేసి కురుపుమీఁదవైచి గుడ్డ గట్టినయెడల ఒకదినములో నెత్తురుగడ్డలు చితుకును.

ఆ. చందనమును సొంటి గందంబుఁజిక్కఁగాఁ
గల్పియందులోనఁ గప్పురంబుఁ
జేర్చిలేచుచున్న చిన్న గడ్డలమీఁద
నద్దిరాచిరేని నణఁగిపోవు. 65

తా. మంచిగందము, సొంటిగందము, చిక్కఁగాదీసి కల్పి అందులో కర్పూరమునువైచి క్రొత్తఁగాలేచుచున్న చిన్నగడ్డలకు రాచినయెడల అణఁగిపోవును.

గీ. పిడుకనిప్పు కలువమునఁబెట్టి యాము
దమున మెత్తఁగనలారి ముద్దగ నొనర్చి
పూటకొకసారి చొప్పున బూసిరేని
వేగనెత్తురుగడ్డలు బాగుపడును. 66

తా. పిడకనిప్పు కల్వములోఁబెట్టి ఆముదముతోనలారి ముద్దజేసి పూటకొకమారుచొప్పున పూసినయెడల శీఘ్రముగం నెత్తురు గడ్డలు బాగుపడును.

నాళికావ్రణమునకు.

ఆ. వడ్లగింజయెత్తు పరమూమహామ్మాయి
గోరువెచ్చనయిన వారిలోనఁ

గానివరహిమాంబు కణములలోఁ గాని
గలిపిరాయ ముక్కుగడ్డమాను. 67

తా. వడ్లగింజ యెత్తు మంచిమహమ్మాయినిగోరువెచ్చ
గానున్న నీటిలోనయినను మంచునీటిలోనైనసుగలిపిపట్టించిన
యెడల ముక్కులోఁబుట్టుకురుపు మానును.

ప్రేవుకురుపునకు (అంత్రవ్రణము)

ఆ. అనప పప్పు నీటియందుననానించి
నూరియందు బంచదారఁ గలిపి
తిననఁ బేగునందు జనియించుపుండొక
మూఁడుపూటలకును మాడఁగలదు. 68

తా. అనపపప్పు నీటిలో నానఁబెట్టి మర్దనచేసి అందు
లో పంచదారకలిపి తినినయెడల ప్రేగులలోఁబుట్టుపుండు ఒక
పూటలో మానిపోవును.

నేత్రవ్రణములకు— (లూతవ్రణము)

గీ. నయనమునఁబుట్టు లూతవ్రణములుతువరి
మన్ను బుష్పాంజనమును సమముగనూరి
వ్రేలితోఁగొల్కి నిడినఁ గుందేలుమాంస
ముడు భుజించినయెడ శీఘ్రముగనుమాను. 69

తా. తువరిమన్ను, పుష్పాంజనము, ఈరెండునుసమా
ముగా మర్దనచేసి వ్రేలితో కనుకొలికియందుఁ బెట్టినను చెవ
పిల్లిమాంసముం దినినను, నేత్రవ్రణములు మానును.

ఉ. తుమ్మెదగూటిమన్నుగొని దుగ్ధముతోడనుగాని లేకతో
యమ్మునగానినూరి వలయమ్ముగరాచిన లేక మైలుతు
త్థమ్మునుజన్నుబాలనిడఁ దప్పకమానును బూటలోననే
త్రమ్ములమీఁదిగడ్డలగదంకృతులీక్రియ సేయుటొప్పగుకా.

తా. తుమ్మెదగూటిమన్ను తీసికొని పాలతోఁగాని లేక నీటితోఁగాని నూరికురుపునకు చుట్టునురాచినను, లేక మైలుతుత్థమును చన్నుబాలతో నూరిపెట్టినను పూటలోనేత్రముల మీఁది గడ్డలుమానును. కాఁబట్టి వైద్యులీవిధానమును జేయవలెను.

నాభీవ్రణమునకు (విద్రధి.)

గీ. మంగచెక్కయుఁ బాటకారింగువయును
మెత్తగానూరి యదినాభిమీఁదఁగట్ట
విద్రధిసమాఖ్యబొడ్డులో వేయునట్టి
వ్రణము నిశ్శేషముగమాను బ్లవగవర్య. 71

తా. మంగచెక్క, పాట, కారింగువ ఇవి మూఁడును మెత్తగామర్దనచేసి దానిని బొడ్డుమీఁదఁ గట్టినయెడల విద్రధి యనుపేరుగల బొడ్డులోవేయుకురుపు నిశ్శేషముగామానును.

శిరోవ్రణమునకు.

గీ. మంగచెక్కరసంబును మరగఁగాచి
యందునిరువదియైదవ యంశగాఁబ్ర

పౌండరీకమునిడి తలనిండరాచి
రద్దిన శిరోవ్రణంబులు రూపుమాయు. 72

తా. మంగచెక్క రసమును మరుగునట్లుకాచి దానిలో ఇరువదియైదవభాగముగా కర్పూరపుబెండనువైచి తలనిండ రాచి రద్దినయెడల శిరోవ్రణములు నశించును.

గీ. పెద్దవావింటదొండాకు పేరుకొనిన
సున్నమునుసల్పిగుడ్డలోఁ జుట్టిచెవిని
బిండినను జెవిలోఁ బుట్టుపుండుపండి
చితికిమానును మొదలంట శీఘ్రముగను. 73

తా. పెద్దవావింట, దొండాకు, పేరుకొనినసున్నము, ఇవిసలిపి గుడ్డలోఁజుట్టి చెవిలోపిండినయెడల చెవికురుపు చితికి శీఘ్రముగామానును.

ఆ. వట్లగింజ యెత్తు వరమహామహాహ్మాయి
గోరువెచ్చనైన వారిలోనఁ
గానివరహిమాంబు కణములఁగానిగ
లిపియిడినను జెవి కురుపులుమాను. 74

తా. వట్లగింజయెత్తు మహామ్మాయి గోరువెచ్చగాను నీళ్లలోఁగాని మంచిమంచునీటిలోగాని కలిపిపోసినయెడల చెవికురుపులుమానును.

గీ. ఆరెచెక్కరసంబు జంబీరఫల ర
సంబురుద్రజడాకురసంబు సరిగఁ

గలిపిచెవిలోనబోసిన గడ్డలున్నఁ
జితికిపోటంతయును మానుశీఘ్రముగను. 75

తా. ఆరెచెక్కరసము, నిమ్మపండ్ల రసము, రుద్రజడాకురసము ఇవిసమానములుగాఁ గలిపి చెవిలోఁ బోసినయెడల, కురుపులున్నయెడలఁ జితికి వెంటనేపోటుతగ్గును.

గీ. నాగవల్లీదళంబు సున్నమునుబోక
చెక్కయునుధూమ్రపత్రముఁ జితుకఁగొట్టి
గుడ్డలోఁబెట్టిచెవిలోన గురిగఁబిండ
వ్రణమునిశ్శేషముగమాను వనచరేంద్ర. 76

తా. తమలపాకు, సున్నము, పోకచెక్క, పొగాకు ఇవి చితుకగొట్టి గుడ్డలోపెట్టి సరిగా చెవిలోఁ బిండినయెడల వ్రణమునిశ్శేషముగామానును.

నొసటికురుపునకు.

గీ. రెండుగన్నేరువేరుల నెండఁబెట్టి
నూరిఘృతముననైనను నూనెనైన
వండిపూయనొసట నుద్భవంబులైన
పుండ్లుమానును వేగంబ పూర్ణముగను. 77

తా. గన్నేరువేళ్ళను రెండిటిని ఎండఁబెట్టి నూరి నేతితోనైనను లేకనూనెతోనైనను ఉడికించి పూసినయెడలనొసటనుబుట్టినట్టి కురుపులు వెంటనేమానును.

## రొమ్ములోని కురుపులకు.

గీ. మేకపాలను బొంగించి మిరియపుబొడి
పంచదారయుఁగల్పి త్రావించిరేని
రొమ్ములోఁబుట్టునట్టి వ్రణమ్ముమూఁడు
దినములకు శాంతినొందును వనచరేంద్ర. 78

తా. పొంగించిన మేకపాలలో మిరియపుబొడి, పంచదారగలిపి త్రాగించినయెడల రొమ్ములోఁబుట్టిన కురుపుమూఁడుదినములకు మానును.

## పిల్లలకాళ్ళేతులమీఁది కురుపులకు.

క. బాలురమూత్రమునఁ గడిగి
పాలును సున్నమునుబసుపుబట్టించిపయిన్
జేలికగట్టిన బిల్లల
కాలిపయిం బుట్టునట్టిగడ్డలుమానున్. 79

తా. పిల్లలమూత్రముతోఁ గడిగివైచి, పాలు, సున్నము, పసపు ఇవిమూఁడునుబట్టించి ఆమీఁదనొక గుడ్డనుగట్టిన యెడల కాలిమీఁదఁబుట్టునట్టి గడ్డలుమానును.

గీ. గుగ్గిలము తేనె మైనము గుడముసైంధ
వలవణము తేనె సమభాగములుగనూరి
పాకమునుబట్టి పగిలినపాదములకుఁ
జేతులకురాయ మానుచు శీఘ్రముగను. 80

తా. గుగ్గిలము, తేనె, మైనము, బెల్లము, సైంధవ లవణము ఇవి సమభాగములుగా నూరి పాకముబట్టి పగిలిన కాళ్ళకు, చేతులకుఁ బట్టించినయెడల వెంటనేమానును.

సాధారణదుష్టవ్రణములకు.

సీ. బదరీదళములు వేపజివురు దగనూరి
గాని నల్లనితిలకల్కమందు
నింబదళములు తేనెయునూరి చేర్చిగా
ని తెగడ తిలలు దంతిమొదలు వస
వేపాకునుం బాటవేరు సైంధవలవ
ణంబు మెత్తగను జూర్ణంబు జేసి
తేనెయందునఁగల్పి గాని లేపనము సే
సినను దుష్టవ్రణమునను బుట్టు
గీ. వాపులన్నియు దినములోపలహరించు
వ్రణము నీర్వట్టకుండఁ గాపాడుఁబుండు
నంబు పురుబుట్టకుండు క్షణంబులోన
నౌషధగుణంబు తెలియఁగానగు మహాత్మ. 81

తా. రేగు ఆకులు, వేపాకు ఇవి రెండును నూరి యైనను నల్లనువ్వులు కల్కముచేసి అందు వేపాకులు తేనెతో నూరిచేర్చియైనను, తెగడ, నువ్వులు, దంతివేరు, వస, వేపాకు, పాటవేరు, సైంధవలవణము ఇవి మెత్తగా చూర్ణముచేసి తేనెలోఁ గలిపిగాని పూసినయెడల దుష్టవ్రణమునందు బుఁ

వాపులన్నియు ఒకరోజులో మాని వ్రణము నీరుపట్టకుండఁ జేసి పుండుపురుగుపట్టనీయక క్షణమాత్రములో ఔషధ గుణము జూపించును.

గీ. మ్రానిపసపును మంజిష్ఠ మణిశిలయును
నేయిపసపును లక్క తేనెయును జేర్చి
కలిపి లేపనమొనరింపఁ గఠినచర్మ
రోగములు మానిపోవును రూఢిగాను. 82

తా. మ్రానిపసపు, మంజిష్ఠ, మణిశిల, నేయి, పసపు, లక్క, తేనె వీనిని జేర్చికలిపి పూసినయెడల ఎంతకఠినము లయిన చర్మరోగము లయినను మానిపోవును.

గీ. అన్నభేది లవంగలోహములు మ్రాని
పసపుఁ ద్రిఫలంబులును నూరి పట్టువేయ
నెట్టివ్రణమును నెన్నఁడుఁ బుట్టకుండ
మాని వెంటనె క్రొత్తచర్మంబు దొడగు. 83

తా. అన్నభేది, లవంగములు, లోహములు, మ్రానిపసపు, కరకతాడి యుసిరికలు, నూరి పట్టించినయెడల నెట్టివ్రణములయినను నెన్నఁడును బుట్టకుండునట్లు మాని వెంటనే క్రొత్తచర్మమును దొడగును.

మ. వెలిగారంబును దెల్లచంద్రియును గంపిల్లంబునుఁ గా రేణుక
జలజాతచ్ఛద తుత్థముల్ వసయవక్షారంబునుం జిట్టిబ

చ్చలియునొంటి లవంగపట్టయును సద్యక్షారముందుల్యావ
గ్గలుగఁ గోఘృతమందు నూరియిడఁ బేరున్నాయుబుండ్ల
న్నియుఁ. 84

తా. వెలిగారము, తెల్లచంద్ర, వావిలి, పర్పాటకము, తామరాకు, తుత్థములు, వస, యవక్షారము, చిత్రి, బచ్చలి, సొంటి, లవంగపట్టు, సర్జక్షారము, వీనినిసమానభాగములుగా ఆవునేతితో నూరి పట్టించిన యెడల అన్నిజాతుల పుండ్లును నశించును.

గీ. త్రిఫలములును విడంగముఁ దిప్పతీగ
త్రికటుకము చేదుపొట్ల సరిగనునూరి
యంతగుగ్గిలమునుంచి ప్రత్యహమునక్ష
పరిమితిందిన్న మానును వ్రణములెల్ల. 85

తా. కరక, తాడి, యుసిరికలును, తిప్పతీగ, శొంఠి పిప్పలి, మిరియములు, చేదుపొట్ల వీనిని సమాన భాగములుగ నూరి అంతగుగ్గిలమునందు జేర్చి ప్రతిరోజును, అక్షపరిమాణముభుజించినయెడల నన్నివ్రణములును మానును.

గీ. గుగ్గిలము త్రిఫలంబులు నుగ్గుసేసి
తేనె యనుపానముగదిన మాను నెట్టి
వ్రణములేనియు గావున వైద్యులీవి
ధంబుజేసిన రోగిసౌఖ్యంబునొందు. 86

తా. గుగ్గిలము, కరక తాండియుసిరికలు, గుండ గాఁగొట్టి తేనె యనుపానముతోఁ దినిన యెడల ఎట్టి వ్రణము లయినను మానును. కనుక వైద్యులీవిధానము జేసినయెడ రోగి సౌఖ్య పడును

క. త్రికటుకములు త్రిఫలంబులు
నొకకల్వమునందు సరిగ నుంచియుమఱియిం
చుకగుగ్గిలంబునిడిమా
త్రకట్టుగట్టి తినఁబుండ్లుతప్పకమానుౘ. 87

తా. శొంఠిపిప్పలి మిరియములు, కరక తాండియుసిరికలు సమముగ నొకకల్వమున వైచి కొంచెము గుగ్గిలమును గలిపి మాత్రకట్టఁగట్టి తినినయెడల పుండ్లుమానును.

క. నువులును నతిమధురమున్సైం
ధవలవణము పసుపు నింబదళములుపీనిం
దవజూర్ణంబును జేసిమ
ధువున నాయంగమాను దుష్టవ్రణముల్. 88

తా. నువ్వులు, అతిమధురము, సైంధవ లవణము, పసపు, వేపాకు వీనిని చూర్ణముగాఁ జేసి తేనెతోఁగలిపి, రాచిన యెడల దుష్టవ్రణములు మానును.

గీ. పసపు నతిమధురము వ్రమానిపసపు వసయు
నువ్వు వేపాకును దెగడయును సరిగను

నూవుకల్కంబుతో నూరి యావునేయి
గలిపిపూసినఁ జెడుపుండ్లుతొలఁగు వేగ. 89

తా. పసపు, అతిమధురము, మ్రానిపసపు, వస, ఉప్పు
వేపాకు, తెగడ, ఇవి సమానభాగములుగా నువ్వుల కల్కము
తోఁగలిపినూరి, ఆవునేయి గలిపి పూసిన యెడల శీఘ్రముగాఁ
జెడుపుండ్లు మానును.

సీ. శుద్ధ వ్రణమును నశుద్ధవ్రణంబును
నశ్వత్థ వటకషాయములఁ గడుగ
నగు చేదుపొట్ల వేపాకుకషాయంబు
లనుగడుగంగ వలెను వ్రణమ్ము
వాతవ్రణముగడ్గవలె దశమూలక
షాయంబున వటకషాయమునను
పైత్త్యవ్రణములుఁ గఫవ్రణంబులరేల
చిగురుకషాయంబు చేతఁగడుగ
గీ. వలయునిబ్భంగి క్రమము దప్పక వ్రణములఁ
గడుగనీర్వట్టుటయు నీపిబోడముటయును
సలుపుటయు వాచుటయు లేక శాంతినొందు
వెజ్జులిదిముఖ్యమనుచు భావింపవలయు. 90

తా. రావి మఱ్ఱి కషాయముచే శుద్ధవ్రణములను, అశు
ద్ధవ్రణములను గడుగవలెను. చేదుపొట్లవేపాకు కషాయముల
చేత సాధారణవ్రణములను గడుగవలెను. మెంతి, కోలపొన్న

నేలములగ, ములుక, పల్లేరు, మారేడు, నెల్లి, తుందిలము, గుమ్మడి, కలిగొట్టు, వీనికషాయముచే వాతవ్రణమును గడుగవలెను. మఱ్ఱికషాయముచేత పైత్యవ్రణములు కడుగవలెను. రేలచిగురు కషాయముచేత, కఫవ్రణములు కడుగ వలెను. ఇట్లుకడిగిన యెడల నీరుపట్టుట, వాచుట మొదలయినవి లేక శాంతినొందును, కాఁబట్టి వైద్యులీవైద్యమును ముఖ్యమయినదిగాఁ దలపవలెను.

మ. మయిసాక్షిం గొని మఱ్ఱిపాల సరిగన్మర్దించి పట్టింప వె
న్నయుగర్పూరము నూరిరాచినను వెన్నంజిల్లెడుంబాలు గ
ల్పియిడం బచ్చిపొగాకునూరియిడినన్వేపాకునన్ నూనెనూ
రియిడంబుండునబుట్టుపుర్వ్వులునివారించున్సమస్తంబొగిన్

తా. మయిసాక్షిని మఱ్ఱిపాలతో మర్దించిపట్టించినను వెన్నయు, కర్పూరము నూరిరాచినను, వెన్నలోఁ జిల్లేడుపాలు కల్పి పట్టించినను, పచ్చిపొగాకు నూరి కట్టినను, వేపాకునూనె నూరిరాచినను, పుండులోఁబుట్టుపురుగులన్నియునశించును.

## బొరల గడ్డకు.

గీ. గాయపాకును వెల్లుల్లిగడ్డవీని
రెండిఁటిని నూరి కట్టిన రేలచిగురు
నాముదంబున వేయించి నైనఁగట్టఁ
బొరలగడ్డలు వేగంబుపోవునణఁగి. 92

తా. గాయపాకు, వెల్లుల్లిపాయలు, ఈరెంటిని నూరి కట్టినను, రేలచిగురు ఆముదమున వేచి కట్టినను పొరలగడ్డలు వేగముగామానును.

గీ. బొమ్మజెముడును బిడకల కుమ్ములోనఁ
బెట్టియుడికించి లోనున్న తెట్టుఁదీసి
కట్టినం గలబందనుకాల్చి దాని
లోనిచూనగట్టినను గాని మానఁగలదు. 93

తా. బొమ్మజెముడుమట్టను కుమ్ములోనుడఁకబెట్టిలోపలిమెత్తనిగుంజును దీసికట్టుకట్టినను, కలబందనుకాల్చి దాని లోని చూనను గట్టినను పొరలగడ్డమానును.

కొయ్యగండలకు.

గీ. జెముడుకాడలపాల నిత్యమునుగుడ్డఁ
దడపికండకునంటింపఁ దప్పకుండ
శస్త్రమును జేసినట్టుల జక్కగాను
బదిదినంబులలోఁ గోసిపారవైచు. 94

తా. ప్రతిదినమును జెముడుకాడలపాలతో నొకగుడ్డనుదడపి కొయ్యగండకుఁ బట్టించుచుండినయెడల శస్త్రముచేసినట్లు పదిదినములలోఁ గోసివైచును.

అగ్నిదగ్ధవ్రణములకు,

గీ. కరకతాడియునిరికలు కాల్చిపొడుముఁ
జేసితైలముతోడను జేర్చిరాయ

నగ్నిదగ్ధవ్రణము బాధ యణఁగిమూఁడు
దినములకు మాడిసుఖమిచ్చు మనుజునకును. 95

తా. కరక తాఁడియుసిరికలు కాల్చి పొడుముగొట్టినూనెలోఁగలిపి రాచినయెడల, అగ్నివలనఁ గాలిన వ్రణముబాధ తగ్గమూడుదినములలోమాఁడిపోవును.

క. యవలను గాల్చినభస్మము
నువునూనెంగల్పికొని యనువుగ రాయఁ
జవమునఁ గాలినపుండ్లొక
దివసంబునమాడుపట్టి స్థిమితమొసంగుఁ. 96

తా. బియ్యమును గాల్చిన భస్మము నువ్వులనూనెలోఁ గలిపి చక్కఁగాఁ బట్టించినయెడల కాలిన పుండ్లు ఒక దినములో మాడుపట్టి స్థిమితపడును.

గీ. కరకకాయబురద జీరకమును గుగ్గి
లమును మైనము నతిమధురము నూరి
యావునేతిని లేపనంబమరసేయ
నగ్నిదగ్ధవ్రణపుబాధయడఁగిపోవు. 97

తా. కరకకాయ, మట్టిబురద, జీలకఱ్ఱ, గుగ్గిలము, మైనము, అతిమధురము ఇవినూరి ఆవునేతితో పూసినయెడల అగ్నిదగ్ధవ్రణముయొక్క బాధపోవును.

గీ. మఱ్ఱియూడలకొన లతిమధురమును బ్ర
పౌండరీకముమంజిష్ఠ పచ్చియాకె

పుష్పచందనము రసకర్పూరమావు
పాలతోఁ రాయఁ గాలిన వ్రణముమాను. 98

తా. మల్లియూడలకొనలు, అతిమధురము, ప్రపౌండరీకము, మంజిష్ట, పచ్చి ఆరెపువ్వు, మంచిగంధము, రసకర్పూరము, ఆవుపాలతోనూరి రాచినయెడల గాలినపుండ్లుమానును

గీ. మైనమునుగుగ్గిలమునతి మధురమువస
చాగమంజిష్టలొద్దుగ చందనంబు
కల్కముగఁ జేసి ఘృతమిడి కాచిలేప
నమ్మిడిననగ్నిదగ్ధవ్రణములుమాను. 99

తా. మైనము, గుగ్గిలము, అతిమధురము, వస, చాగ, మంజిష్ట, లొద్దుగ, మంచిగంధము, ఇవి కల్కముగాఁ జేసినేయిగలిసికాచి రాచినయెడల అగ్నిదగ్ధవ్రణములుమానును.

గీ. చేదుపొట్లకషాయము చేసియుంచి
మైనఁ గల్కంబుగాఁదీసిమైననావ
నూనెతోఁ గాచి రాచిరయేని నెట్టి
యగ్నిదగ్ధవ్రణములుఁ జయ్యనహరించు. 100

తా. చేదుపొట్ల కషాయముచేసి మైనను, కల్కముగా జేసిమైనను, ఆవనూనెతోఁగాచిమైనను, రాచినయెడల నెట్టియగ్నిదగ్ధవ్రణములైనను వెంటనేమానును.

క. సమముగఁ ద్రిఫలంబులుగా
ల్చినవెంటనె చూర్ణములుగఁ జేసి నువులనూ

నెయిఁగల్పి లేపనముఁ జే
సినఁగాలిన వ్రణములెల్లశీఘ్రముమానుఁ. 101

తా. కరక తాడియునిరికలు సమానభాగములుగాకా ల్చిచూర్ణముజేసి నువ్వులనూనెతోఁ గల్పిపూసినయెడల కాలిన వ్రణములు శీఘ్రముగా మానును.

గీ. యష్టిమధుకంబు కరకకాయయునుజిగట
మన్నునంజీలకఱ్ఱయు మైనమునుగ
లువమునఁనునూరి దానికీఁదవినగోఘృ
తంబునిడి రాయమాను దగ్ధవ్రణంబు. 102

తా. యష్టిమధుకము, కరకకాయ, జిగటమన్ను, జీలకఱ్ఱ, ఇవి మైనముతో కలువమునందువైచి నూరి దానికితగిన ఆవునేయిపోసి రాచినయెడల దగ్ధవ్రణముమానును.

గీ. అశ్మచూర్ణజలంబున నవిసెనూనె
నైనలేక మఱియుఁ జేపనూనెనైనఁ
గసిపిరాచిన నగ్నిదగ్ధవ్రణములు
మానునిస్సంశయముగను మర్కటేంద్ర. 103

తా. మణిశిల పొడిగలిపిన నీటిలో అవిసెనూనెయైనను చేపనూనెయైనను, గలిపిరాచినయెడల నిస్సందేహముగా అగ్నిదగ్ధవ్రణములు మానును.

తైలదగ్ధవ్రణములకు.

గీ. మిాగడయుఁ బ్రాఁతసున్నంబు మెదపిరెండుఁ
దైలదగ్ధవ్రణంబు మీఁదనిడిరేని

మంటయును నాటుపోటును మాని వేగ
నంచుగట్టిముదంబు ఘటించుమాడి. 104

తా. మీగడ, ప్రాతసున్నము, రెండును రంగరించి తైల దగ్ధవ్రణముల మీఁదఁబూసిన యెడల మంట, ఆటు, పోటు, ఇవిమాని శీఘ్రముగా అంచుగట్టిమాడిపోవును,

శస్త్రాస్త్రములవలని గాయములకు.

గీ. అవిసె యడవిసదాపయు నడ్డసరము
సమముగానూరి పట్టింప శస్త్రములయు
నస్త్రములయును గాయంబులంతరించి
సౌఖ్యమొనగూడు శీఘ్రమజనులకెందు. 105

తా. అవిసె అడవిసదాప, అడ్డసరము, ఇవిసమానభాగముగానూరి పట్టించినయెడల శస్త్రాస్త్రములవలన నైనగాయములుమాని జనులకుసౌఖ్యము కలుగును.

గజ్జికి.

క. మణిశిల బూసినగజ్జియు
వ్రణములునుఁ దద్రురోగవగణంబునుమా
నునుగాన నీచికిత్సను
పనిగొని సేయంగవలయు వైద్యులునతముఁ 106

తా. మణిశిల పూసినచో గజ్జి, వ్రణములు, దద్రురోగములు, మానిపోవును గావున వైద్యులెప్పుడును ఈచికిత్సను తప్పక సేయవలెను.

గీ. మూరుకొండసమూలము నూరియుప్పు
నీటనిడియందు మంచినూనెయునుగప్పు
రంబునుంగల్పి యొడలికి రాచిరేనిఁ
దీటగజ్జినశించును పూటలోన 107

తా. మూరుకొండచెట్టు వేరుతోగూడనూరి, ఉప్పునీటిలోవైచి అందు మంచినూనె, కర్పూరము, కలిపి శరీరమునకుఁ బూసిన యెడల తీటగజ్జి ఒకపూటలో నశించి పోవును.

క. ఆముదము గుల్లసున్నము
జామొక కల్వంబులోనఁ జమిలియిడంగన్
గోమయముంబట్టింపం
జీము వెడలి గజ్జికురుపు శీఘ్రముమానున్. 108

తా. ఆముదము, గుల్లసున్నము, ఒకజాము మర్దించి పెట్టినను ఆవుపేడంబట్టించినను, గజ్జికురువు చీముగారిమాని పోవును.

క. మురదారుసింగు వెన్నం
గరుగఁగ మర్దించి రాయగజ్జియుమంటల్
దురదలు గరుకును గులచీ
దరయును నిమిషంబులోనఁ దప్పకమానున్. 109

తా. మురదారుసింగు వెన్నతోకరగునట్లుమర్దించిరాచిన యెడల మంటలు, దురదలు, గరుకు, గుల, చీదర ఇవిక్షణకాలములో తప్పక మానును.

గీ. అడవివమాబీరకాయయు నాకురెండు
భస్మముంజేసి నూనెలోపలను గలిపి
పూస చలినీళ్ళస్నానంబుఁ జేసిరేనిఁ
దీటగజ్జినశించును బూటలోన. 110

తా. అడవిమాబీరకాయ, ఆకులు రెండును భస్మముచేసి నరానెలోకలిపి పూసి చలినీళ్ళ స్నానముఁచేసినయెడల తీట గజ్జి ఒకపూటలో నశించును.

గీ. తెల్లగజ్జేరువేరును దేవదారు
తైలము సమానముగనార దబ్బపండు
రసముతోమెత్తగానూరి రాచిరేని
నెట్టిగజ్జియు నెన్నఁడు బుట్టకుండు. 111

తా. తెల్లగన్నేరువేరు, దేవదారుతైలము ఇవి సమాన భాగములుగా నార దబ్బపండు రసముతో మెత్తగా నూరి రాచిన యెడల, ఎటువంటి గజ్జియైనను మరలఁ బుట్టకుండ మానును.

గీ. ఉత్తరేణి సమూలంబు నుప్పునీట
మూఁడుగడెలూరనిచ్చి జిల్లేడుపాల
నూరిపట్టించిరేనియు బిరువోక
గజ్జియొకపూటలోమానఁగలదు నిజము. 112

తా. ఉత్తరేణిచెట్టువేరుతోఁగూడ ఉప్పునీటిలోమూఁడుగడియల కాలము ఊరబెట్టి అది జిల్లేడుపాలతో మర్దించి పట్టించినయెడల నిజముగాఒకపూటలో అడ్డులేకుండమానును

మొలగజ్జికి.

ఆ. అరటిపండుతొక్కయైనను బచ్చిపొ
గాకుగాని వేసి యదిమికట్ట
నాల్గుకట్లలోన నసగల మొలగజ్జి
మానిసుఖముగల్గు మనుజులకును. 113

తా. అరటిపండు తొక్కయైనను, పచ్చిపొగాకైనను వేసి గట్టిగా కట్టినయెడల నాలుగుకట్లతో దురదగానున్న మొలగజ్జి మానిపోవును.

క. అంకుడుచెక్క రసంబును
గుంకుడుకాయరసముప్పుఁగొడి మొలగజ్జిం
గొంకక బట్టించినచో
నంకెకురానిదియుమాని హర్షంబొసఁగున్. 114

తా. అంకుడుచెక్క రసమును, కుంకుడుకాయరసము, ఉప్పు, దీపపుకొడియు, వీనిని మొలగజ్జికిఁ బట్టించినయెడల సాధ్యముగాని మొలగజ్జియు మానిపోవును.

తామరకు.

ఆ. గంగరావికాయ గాడిదగడపాకు
రెండుసరిగనూరి యెండఁబెట్టి
యందులోనఁ బచ్చియంకుడుచెక్కర
సమిడిరాయఁ దామరమ్మృతిఁజెందు. 115

తా. గంగరావికాయ, గాడిదగడపాకు, ఇవి రెండును సమానభాగములుగా మర్దించి యెండఁబెట్టి, అందులో పచ్చి అంకుడుచెక్క రసమును గలిపి రాచినయెడల తామర చచ్చి పోవును.

గీ. పండుమోదుగుమాడలు గుండఁగొట్టి
నీటితో మెత్తగానరారి నిమ్మపండ్ల
రసము తగుమాత్రముగఁగల్పి రాచిరేనిఁ
దామర దినంబులోమాను దప్పకుండ. 116

తా. పండిన మోదుగమాడలు గుండఁగొట్టి నీటితో మెత్తగానరారి నిమ్మపండ్ల రసము కొంచెముగలిపి రాచినయెడల తామర ఒకదినములోమానును.

సీ. పీసెడుకొబ్బరిపెంకులు ముక్కలు
గాఁజేసియొకపెద్ద కడవలోనఁ
బోసియుందున్నట్టి ముక్కలమీఁదబె
త్తెడులోననొకచిన్నవిడతఁగట్టి
కరవీరమూల శకలములునాల్గందు
వైచికడవమీఁద వాటముగను
రాగిగిన్నెనుబెట్టి బాగుగనావిరి
పోకుండ మట్టిని బూతబూసి
గీ. జలముచేనింపి పొయిమీఁద జ్వాలగాచి
రెండుమారులు మరుగంగ గుండదింపఁ

బిడతలోఁ ద్రావకముదిగుఁబిదపదానిఁ
దామరకుఁబూయ మానును తత్క్షణంబ. 117

తా. వీసెడు కొబ్బరిపెంకులు ముక్కలుగాఁజేసి ఒక పెద్ద కడవలోఁబోసి, అందున్న పెంకులమీఁద బెత్తెడు ఎడము గా నుండునట్లొక పిడకను కడవలో వ్రేలాడఁగట్టి, ఆపిడతలో ఎఱ్ఱగన్నేరు వేళ్ళు నాలుగువైచి ఆకడవపై రాగిగిన్నె నొక దానిని మూతబెట్టి రాగిగిన్నె, కడవమూతిసందునుండి ఆవిరి పోకుండ మన్నుమేగి పై రాగిగిన్నెనిండ నీళ్ళుపోసి కడవను పొయిమీఁదబెట్టి మరుగునట్లు కాచవలెను. ఇట్లురెండుసారులు పోసిననీరు మరగగానే, కుండనుదింపివేసి చల్లార్చివిప్పిచూచితి మేని కుండలో వ్రేలాడఁగట్టిన పిడతలోనికి ద్రావకము దిగును దానిని తామరకుఁబూసినచో వెంటనే మానును.

## దురదలకు.

గీ. అతివసయుఁగలబందయు నాముదమ్ముఁ
బంఘుతంబెపువిత్తులు వావిలియును
మంగచెక్కయు గన్నేరునుం గలియఁగ
నూరిరాచిన దురదలు జేరవెపుడు. 118

తా. అతివస, కలబందయు, ఆముదము, పంఘుతంబె పుగింజలు, వావిలి మంగచెక్క, గన్నేరు వీనిని కలియనూరి రాచిన దురదలు నశించును.